

# చైతన్య గీతికలు - 2


చైతన్య గీతికలు - 2
స్వామి సుందర చైతన్యానంద
ప్రథమ ముద్రణము }- 2014 సంవత్సరం
2000 కాపీలు.



ప్రతులకు :
సర్వజ్ఞ కల్చరల్ ట్రస్ట్,
సుందర చైతన్యాశ్రమం,
హైదరాబాద్ - 500 043.
☎: (08418) 255777,
(08418) 255355
డి.టి.పి. & కవర్ డిజైనింగ్
సుందర చైతన్యాశ్రమం
ముద్రణ :
శ్రీ లక్ష్మీ గణపతి బైండింగ్ వర్క్సు
కొవ్వూరు
☎: (08813) 231575

రూ.50/-


స్వామి సుందర చైతన్యానంద

## నవ్విన పువ్వులు

మధురమైన భావాలను
సుమధురమైన పదజాలంలో తురిమి
మృదు మధురమైన కవితా పల్లకీలో కూర్చోబెట్టి
ఊరేగించేదే కవిత్వమైతే,

దానికి ముందు మాట రాసేందుకు
కవిగా నేను ముందుకు రాలేను.
మీ ముందుకు రాలేను.

కవిత్వ మనేది కేవలం సమదర్శనమే నని
కవి ఏనాడైనా క్రాంతదర్శియే నని
నిజాలను ప్రదర్శించే యత్నంలో
ఋజువులను సృష్టించే ప్రయత్నంలో
యోజనాలను దూరాలుగా, భారాలుగా భావించక
ప్రయోజనాలనే భవ్యంగా, భావ్యంగా తలచి

జననాడిని కుదిపి
జీవనాడిని తెలిసి
జీవన ప్రవంతి నిరాటంకంగా సాగేందుకు

అవరోధాలను తొలగించి
రేపటి ఆశకు తెరదించి
నిన్నటి నిరాశకు సమాధి కట్టి
నేటిని మేటిగా నిలిపేందుకు
సర్వాన్ని సర్వంలో కలిపేందుకు - కవిత్వమొక సాధనమైతే,
కవిగా నేను సాధకుణ్ణి.
సాధ్యాన్ని కూడా.

అవలోకించే వారికి సుందర వనాన్ని
అండ చేరే వారికి చైతన్య నిలయాన్ని
ఆస్వాదించే వారికి ఆనందాలయాన్ని.

ఈ వనంలో
విరబూసిన వేదాంత సుమాలే చైతన్య స్వరాలు
ఈ నిలయంలో
విరజిమ్మిన విజ్ఞాన సౌరభాలే చైతన్య రాగాలు
ఈ ఆలయంలో
విరివిగ వితరణ చేయబడిన ప్రసాదాలే చైతన్య గానాలు.

ఈ పాటల్లో,
మంచి చెడుల మర్మా లున్నాయి.
ధర్మాధర్మాల సందడు లున్నాయి.
వివేకాన్ని పంచే అంగడు లున్నాయి.
పూజించేందుకు గుడు లెన్నో ఉన్నాయి.

వెల కట్టేందుకు యతిప్రాస లున్నాయి.
వెల కట్ట లేని యతి శ్వాస లున్నాయి.

మాసిపోని మాట లున్నాయి.
హద్దులు దాటిన పదా లున్నాయి.

తెల్లని కాగితాలపై తేలియాడే ఈ నల్లని రాతలు
కాలం చెల్లే రాతలు కావు. కాలంలో చెల్లని రాతలూ కావు.
ఇవి జ్ఞానక్షీరాన్ని అందించే మాతలు
తప్పకుండా తుడుస్తాయి మన తల రాతలు.

ఇందులో,
కవిలేడు. కవిత్వ ముంది.
గాయకుడు లేడు. గాన ముంది.
వేదాంతి లేడు. వేదాంత ముంది.
కర్త లేకుండా సాగిన కర్మ ఇది. యజ్ఞమిది. జ్ఞానయజ్ఞ మిది.

వసంతాన్ని చూచేందుకు కళ్ళు సరిపోతాయి.
అనుభవించేందుకు హృదయ ముండాలి.

సున్నితమైన ఒక హృదయం ఒలికించిన
కవితా సుధలను పట్టి నిలుపుకొనేందుకు
సరియైన పాత్ర మరొక సున్నిత హృదయమే.

హృదయేశుని రస మందిరమే.
సరసమయ నవరస మందిరమే.
సమరస మందిరమే.

కలలను కరిగించే
కవితా ఉషస్సులో
ప్రార్థననే ప్రాణవాయువుగా పొందిన
ఓ కిరణం

స్వామి సుందర చైతన్యానంద

## విషయ సూచిక

### (చైతన్య గానం - 12)



### (చైతన్య గానం - 13)



### (చైతన్య గానం - 14)



### (చైతన్య గానం - 15)


నా కవితే కోవెల
నా పూజకు తరతరా!

# చైతన్య గానం - 12

## 1. ప్రేమే పూజా ఫలము

*పల్లవి :*

ప్రేమే పూజా ఫలము - మనసార
చేసిన ఆరాధనకు ॥ ప్రేమే ॥

*అనుపల్లవి :*

మహిలో మాయలు మనమున దాల్చక
సుజనుల భజనలు మదిలో కదిలే ॥ ప్రేమే ॥

*చరణములు :*

1. పరుల కొరకు పాలిచ్చును గోవులు
తరువులు రాల్చును సుమ ఫలాలు
పరుల హితములో పరమార్థ ముందని
పరుగులు తీయును నదులు ॥ ప్రేమే ॥

2. వాడదు వీడదు పూజాఫలము
అతి మధురము అమృతము
చిత్తము నందే తత్త్వము నిలుచును
లోకము శివమయ మగును ॥ ప్రేమే ॥

3. ఉన్నది శివుడే ఈ జగమంతా
శివుని యందే విశ్వమంతా
నాలో ఉన్నది తానే కాదా!
నే నున్నది తన లోనే కదా ॥ ప్రేమే ॥



## 2. దోషము చూడకు కరివరదా!

*పల్లవి :*

దోషము చూడకు - కరివరదా!
నా మనసు నీకు తెలియనిదా! ॥ దోషము ॥

*చరణములు :*

1. కోరితినా కోర్కెలు తీర్చమని
పిలిచితినా పసిడి ఇవ్వమని
ఉలకవు పలుకవు కారణ మేమి?
నీదేముంది? నా తలరాతే గాని ॥ దోషము ॥

2. కల్లలు తెలియక ఉల్లము చెదరి
కుంచుకపోతి వంచింపబడి
యెద బాధను ఎరుగలేవా?
కనికరించి కడతేర్చగ రావా? ॥ దోషము ॥

3. ప్రేమ లందుకొని పగలను పంచే
మాయలమారి ఈ జగతి
తెలియక మోసపోయితి స్వామి!
నీవు మరచితే నా గతి ఏమి? ॥ దోషము ॥

4. పాపము చూడకు నీ పాపను నేను
కోపము బూనకు కొరగాను
లోపములే నా లోపల నున్నవి
చూపుము కరుణ కమనీయ వదనా!
॥ దోషము ॥

## 3. తనువులు స్థిరమని

***పల్లవి :***

తనువులు స్థిరమని
ధనములు పరమని
తలచెదరు నరులు - తలచెదరు నరులు
మాయను వలచెదరీ ఘనులు ॥ తనువులు ॥

***అనుపల్లవి :***

కలిమల హరణము - భవజల తరణము
వెన్నుని నామము - విభవము తెలియక ॥ తనువులు ॥

***చరణములు :***

1.కాయము కరుగును - వయసు పెరుగును
మనసు తరుగును - నరకము మిగులును
కష్టముల పడి నష్టమతులై
కాల చక్రమున తిరిగే జీవులు ॥ తనువులు ॥

2. సారము లేని సంసారమున
మరణమే మర్మము మోహమే మహిమ
నేల దూరినా నింగి కెగిరినా
వీడదు జీవుని చేసిన కర్మము ॥ తనువులు ॥

3. సిరులు అనర్థము సర్వము శూన్యము
దీనవదనము జీవుల రూపము
దీనబాంధవుని సన్నిధి చేరిన
తీరును బంధము జన్మము ధన్యము ॥ తనువులు ॥





## 4. కరుణాసాగరా! మొర వినలేవా!

***పల్లవి :***

కరుణాసాగరా! మొర వినలేవా!
నా వ్యథ కనుగొని రావా ॥ కరుణా ॥

***అనుపల్లవి :***

ఓడు బ్రతుకురా! ఒడ్డై రారా!
తీరము నను చేరనీరా! ॥ కరుణా ॥

***చరణములు :***

1.ఆమని తలచే కోయిల పిలిచే
నా హృది నిన్నే వలచే
మది నిండా నిను కొలిచే
ఆమని పొంగెను - కోయిల పాడెను
క్రుంగెను నా మది కుమిలి ॥ కరుణా ॥

2.నింగి నేల రెండుగ ఉన్నా
నేలను విడువదు నింగి
కడుపున దాచును వంగి
నీవు నేను ఒకటిగ ఉన్నా
ఎడబాటే బ్రతుకంతా ॥ కరుణా ॥

3.నిలవదు దేహము ఆగదు ప్రాణము
కాలము చాచును కరము
మరణము తీర్చును ఋణము
రగిలిన మదితో పగిలిన యెదతో
మనగలనా నిను మరచి ॥ కరుణా ॥



## 5. ఎంత కాల మిక?

*పల్లవి :*

ఎంత కాల మిక? ఎన్నాళ్ళీ కినుక?
నీ గుడి ముంగిట ఈ పడిగాపులు ॥ ఎంత ॥

*చరణములు :*

1.నీరసించినవి నరనరాలు
పాలి పోయినవి ప్రాణాలు
వేచి చూచుటకు సమయము లేదయ్యా ॥ ఎంత ॥

2.కలవరింతలే బ్రతుకంతా
ఎదురు చూపులే యెద నిండా
తీరే దెప్పుడు నాలో తపన ॥ ఎంత ॥

3. నిలవదు నీరు కదలదు నేల
నాలో నీవు నిలిచే దెలా?
నీ దాసునిపై నిర్దయ నీ కేల? ॥ ఎంత ॥

4.మెప్పించలేక నొప్పించితి నేమో
మనమున దాల్చకు మృదుహృదయ!
విడిపించు స్వామి భవ శృంఖలములు॥ఎంత॥







## 6. నాలుగు రోజుల ఆట

*పల్లవి :*

నాలుగు రోజుల ఆట - బ్రతుకు
మూడు దినాల ముచ్చట ॥ నాలుగు ॥

*చరణములు :*

1. ఎవరికి ఎవరో ఏమౌతారో
ఎరుగరు ఎవరూ ఇల లోన
ఏదేమైనా, ఎవరెటు పోయినా
చింతే మిగులును భువి లోన ॥ నాలుగు ॥

2. ఆడుచు పాడుచు ముచ్చట లాడుచు
పరుగు పెట్టును పరువము
ముదమే కరువై మనుగడ బరువై
మూల్గుచు ముదిమి కుమిలేను ॥ నాలుగు ॥

3. మనువులు మమతలు మాయల నీడలు
కాల కొలిమిలో కరిగే బొమ్మలు
సరసిజ నయనుని సర్వశరణ్యుని
సన్నుతి చాలును సద్గతికి ॥ నాలుగు ॥





## 7. రానీ ఏదైనా - పోనీ ఎంతైనా

*పల్లవి :*

రానీ ఏదైనా - పోనీ ఎంతైనా
రానిది పోనిది నీ మహిమ
దానిని మరచుట నా తరమా? ॥ రానీ ॥

*అనుపల్లవి :*

ఇష్టమున్నా గాని కష్టమైతే నేమి?
నష్ట మెరుగనిది నీ స్మరణ ॥ రానీ ॥

*చరణములు :*

1. ఎవరు నీ సాటి - ఉండ రెవరు నా తోటి
నా మనసు నీ దంటి - నీ కొరకే ఉంటి
దైవము నీ వని - నే కనుగొంటి ॥ రానీ ॥

2. నిన్ను వరించెద - నేను తరించెద
నీ అడుగుల కడ శిరమును ఉంచెద
నా పున్నెము గని పరవశించెద ॥ రానీ ॥

3. నిన్నే వేడితి - నిన్ను గూర్చి పాడితి
నీ విభవమును మనసార పలికితి
ఏ మున్నదో నీలో ఎరుగనైతి ॥ రానీ ॥

4. తనయుడు తెలియక - తప్పిన దారి
తండ్రి చూపడా హితమును గోరి
నన్ను గన్న తండ్రీ నీవే శౌరి ॥ రానీ ॥





## 8. ఎవరి గతి ఎటుల నున్నదో !

*పల్లవి :*

ఎవరి గతి ఎటుల నున్నదో
ఈశ్వరుని కెరుక ॥ ఎవరి ॥

*చరణములు :*

(1) శ్రీమన్నారాయణుండు రాముడై అవతరించ
ధర్మపత్ని యగు సీతకు అగ్గి సెగ తప్పినదా? ॥ ఎవరి ॥

(2) పరోపకారి పరమశివుడు పాల సంద్రమును జేరి
కాలకూట విషము మ్రింగి నీలకంఠుడు కాలేదా! ॥ ఎవరి ॥

(3) శాంతి ప్రేమ లందించి తృష్ణ నార్పు కృష్ణమూర్తి
శయనించగ శరము తగిలి దివికి తరలి పోలేదా! ॥ ఎవరి ॥

(4) ఎగసి ఎగసి పడుటె గాని విధిని దాట నెవరి తరము?
అనుభవించక తప్పదులే హరిహరాదు లైన గాని ॥ ఎవరి ॥





## 9. దేశమంటే మనదే నన్నా!

(గ్రామ చైతన్యం గీతం)

*పల్లవి :*

దేశమంటే మనదే నన్నా!
జగతిలో ఇదియే మిన్న! ॥ దేశ ॥

*చరణములు :*

1. దేవుడెవరో తెలిపిన భూమి
దయాగుణములో నిలిచిన భూమి
ప్రేమ మార్గము చూపిన భూమి
జగతిలో మనదే అగ్రగామి ॥ దేశ ॥

2. కండలిచ్చాడు శిబి ఆనాడు
కానల కేగాడు రామచంద్రుడు
బ్రతుకునే బలి ఇచ్చాడు బాపు
వారి పేరును నీవు నిలుపు ॥ దేశ ॥

3.అన్నమొక్కటే చాలదు నీకు
కావలసింది ఎంతో కలదు
మనిషికి కాంతి మనసుకు శాంతి
ఇచ్చేదే మన దేశసంస్కృతి ॥ దేశ ॥

4. మాయలు తెలిసిన మానవ మృగాలు
మంట గలిపాయి మానవ జాతిని
వెలవెల పోతున్న జాతి కీర్తిని
నిలబెట్టాలి గ్రామజీవనం ॥ దేశ ॥

5. అవని ఎంత గట్టిదైనా
అంకుర మెంత మెత్తని దైనా
పిడికిలి బిగించి రాదా - పైకి
అదియే స్ఫూర్తి నీ మార్గానికి ॥ దేశ ॥



# చైతన్యగానం - 13

## 10. సాగిపోతున్నది

*పల్లవి :*

సాగిపోతున్నది
మోక్ష తీరానికి సద్గురు నౌక ॥ సాగి ॥

*అనుపల్లవి :*

భయమును, భవమును దాటించు నౌక ॥ సాగి ॥

*చరణములు :*

1. ఆశ్రయ మైనది - అపాయము లేనిది
తీరము చేరే - ఉపాయ మెరిగినది ॥ సాగి ॥

2. ఎక్కించే వాడు - యెద నెరిగిన గురుడు
నడిపే వాడు - నందకుమారుడు ॥ సాగి ॥

3. సాధు జనులతో - నిండిన నావ
సద్భక్తితో ముక్తి - సాధించు త్రోవ ॥ సాగి ॥

4. వేదాంత విజ్ఞాన దారులలో పయనించి
శాంతి ధామములో - దించెడి నావ ॥ సాగి ॥



## 9. దేశమంటే మనదే నన్నా!

(గ్రామ చైతన్యం గీతం)

*పల్లవి :*

దేశమంటే మనదే నన్నా!
జగతిలో ఇదియే మిన్న! ॥ దేశ ॥

*చరణములు :*

1. దేవుడెవరో తెలిపిన భూమి
దయాగుణములో నిలిచిన భూమి
ప్రేమ మార్గము చూపిన భూమి
జగతిలో మనదే అగ్రగామి ॥ దేశ ॥

2. కండలిచ్చాడు శిబి ఆనాడు
కానల కేగాడు రామచంద్రుడు
బ్రతుకునే బలి ఇచ్చాడు బాపు
వారి పేరును నీవు నిలుపు ॥ దేశ ॥

3.అన్నమొక్కటే చాలదు నీకు
కావలసింది ఎంతో కలదు
మనిషికి కాంతి మనసుకు శాంతి
ఇచ్చేదే మన దేశసంస్కృతి ॥ దేశ ॥

4. మాయలు తెలిసిన మానవ మృగాలు
మంట గలిపాయి మానవ జాతిని
వెలవెల పోతున్న జాతి కీర్తిని
నిలబెట్టాలి గ్రామజీవనం ॥ దేశ ॥

5. అవని ఎంత గట్టిదైనా
అంకుర మెంత మెత్తని దైనా
పిడికిలి బిగించి రాదా - పైకి
అదియే స్ఫూర్తి నీ మార్గానికి ॥ దేశ ॥



# చైతన్యగానం - 13

## 10. సాగిపోతున్నది

*పల్లవి :*

సాగిపోతున్నది
మోక్ష తీరానికి సద్గురు నౌక ॥ సాగి ॥

**అనుపల్లవి :**

భయమును, భవమును దాటించు నౌక ॥ సాగి ॥

*చరణములు :*

1. ఆశ్రయ మైనది - అపాయము లేనిది
తీరము చేరే - ఉపాయ మెరిగినది ॥ సాగి ॥

2. ఎక్కించే వాడు - యెద నెరిగిన గురుడు
నడిపే వాడు - నందకుమారుడు ॥ సాగి ॥

3. సాధు జనులతో - నిండిన నావ
సద్భక్తితో ముక్తి - సాధించు త్రోవ ॥ సాగి ॥

4. వేదాంత విజ్ఞాన దారులలో పయనించి
శాంతి ధామములో - దించెడి నావ ॥ సాగి ॥



## 11. విరిసెను వెన్నెల

*పల్లవి :*

విరిసెను వెన్నెల హృదిలోన - నా మదిలోన
కురిసెను పువ్వుల వాన
ఏమని తెలిపెదను? నా భాగ్యము
ఎంతని పలికెదను? ॥ విరిసెను ॥

*చరణములు :*

1. నీ వేణుగానములో
ప్రేమ పిలుపు ఉన్నదిలే
నీ మువ్వల సవ్వడిలో
ముజ్జగాలు ఒదిగెనులే
నీ కరుణకు నోచుకున్న
బ్రతుకే తరియించునులే ॥ విరిసెను ॥

2. జగతి లోని అందమంతా
నీదే నని తెలిసెనులే
రవళించు రాగాలన్నీ
నవ్వులుగా వినిపించెనులే
మనసేమో మురిసి పోయె
నీ జాడలు తెలియగనే ॥ విరిసెను ॥

3. మంచుతెరలు కరగిపోయె
నీ రాక తెలుసుకొని
వింత వింత విరులు విరిసే
పరిమళాలు నింపుకొని
తడబడితిని తడి కన్నులతో
నిగనిగ లాడే నిను చూసుకొని ॥ విరిసెను ॥





## 12. అంతా జ్ఞానమయం

*పల్లవి :*

అంతా జ్ఞానమయం - ఈ జగతి
అంతా ప్రేమమయం ॥ అంతా ॥

*అనుపల్లవి :*

ఏదున్నా - ఎలా ఉన్నా సంగతి నియతి ॥ అంతా ॥

*చరణములు :*

1. పువ్వుకున్న సొగసు తేనెకు రాదు
తేనె లోని తీపి పువ్వులో లేదు
పువ్వు లైనా, తేనె లైనా
నియతికి దూరం కాదు ॥ అంతా ॥

2. వీచే దెలాగో గాలికి తెలుసు
కురిసే దెలాగో మబ్బుకు తెలుసు
ఆడే దెలాగో నెమలికి తెలుసు ॥ అంతా ॥

3. నింగి నేలను కలిపేది వెలుగు
ఆ వెలుగు లోనే అందరి పరుగు
వెలుగులకు వెలుగు
ఎవరు ఎరుగు? ॥ అంతా ॥

4. ఉన్న దెన్నడూ పోయేది కాదు
లేని దెప్పుడూ వచ్చేది లేదు
ఉన్నది దైవము లేనిది జగము ॥ అంతా ॥



## 13. ఎంత పారినా!

**పల్లవి :**

ఎంత పారినా నదీజలము
సంద్రము చేరి ఉప్పగును
బావి లోని జలమే అయినా
తులసితో కలసి తీర్థమౌను ॥ ఎంత ॥

**అనుపల్లవి :**

తెలుసుకొంటి ... మేలుకొంటి
ఆవలి దరికి ... సాగిపోతుంటి ॥ ఎంత ॥

**చరణములు :**

1. శ్రావణ మేఘం కురిసింది చల్లబడింది మది
మేఘధ్వని విని మనసు నెమలియై నాట్య మాడింది
శ్యామసుందరుని మోము చూచుటకు మెరపు మెరిసింది
పొంగిన హృదయం నా దైవమని హారతి పట్టింది ॥ ఎంత ॥

2. దివారాత్రములు దిక్కులు వెతికితి నిన్నే తలపోసి
పుణ్యఫలముగా కంటబడిన నిను తదేకముగా చూసి
హృదయ వనములో నీ కొరకై విరిసిన పువ్వులు కోసి
నిను చూసుకొని నిండు మనసుతో పదములపై పోసి ॥ ఎంత ॥

3. ఆశ్రితావనా! అనంతశయనా! నందగోప తనయా!
జన్మజన్మముల చేసిన పుణ్యము చేతికి అందెనయా!
పావనమైన నీకు ప్రియమైన తులసి నైతినయా!
తీర్థ మగుటకు నీ పదముల పడి నిలిచి పోదునయా! ॥ ఎంత ॥





## 14. ఎందుకు నీ దయ రాదు ?

**పల్లవి :**

ఎందుకు నీ దయ రాదు? . . . కృష్ణా . . . . .

**అనుపల్లవి :**

పూజ లెన్నో చేసి - దారు లెన్నో కాచి
వేచి చూచిన కనులు కాయలు కాచే . . . . కృష్ణా!

**చరణములు :**

1. పంకమున పుట్టిన పద్మము తగదని
హృదయ కొలనులో
పూయించితి నిను గని
ప్రేమ జలములో పెరిగిన భక్తి
సుమము సమర్పించితిని . . . కృష్ణా!

2. కఠినమైన కొమ్మకు కాచిన ఫలము
పూజకు కాదని మానుకొంటి
నీవే కర్తగా సాగిన నా కర్మ
ఫలమే మేలనుకొంటి . . . . కృష్ణా!

3. వేద్యుడవు ఆరాధ్యుడ వైన
నీకు నైవేద్యము ఏదో తెలియక
నీ మెలకువలో మెలిగిన మనమును
విందుగ ముందుంచితిని . . . . కృష్ణా!

4. కపురము వెలిగించి
కాంతిని తీసిన
కాగే కాంతి సరిగాదని ఎంచి
రాగ రసములో తడిపిన భక్తి
వత్తిని వెలిగించితిని . . . కృష్ణా!



## 15. మేలుకో ఘనశ్యామా!

**పల్లవి :**

మేలుకో ఘనశ్యామా - మేలుకో పరంధామ
మేలుకో మేలుకో - మమ్మేలు కొనుటకు ॥ మేలుకో ॥

**అనుపల్లవి :**

సర్వలోకాధార - సజ్జన మందార!
సేవకై నిలిచారు - సంతులు సాధువులు ॥ మేలుకో ॥

**చరణములు :**

1. ఎంత ప్రేమ బంధమో - పూర్వ జన్మ సంబంధము
మరువలేక మిత్రుడు మమత వీడలేక
వెలుగు నిచ్చిన వేల్పును వేడుకొనుటకు
ఏతెంచు చున్నాడు - ఏడు గుర్రాలపై ॥ మేలుకో ॥

2. వర్ణించగలనా - నీ నగుమోమును
పువ్వుల నవ్వును - వెన్నెల చూపును
కాచే వాడివి బ్రోచే వాడివి
కనుచూపు లోనే కాపాడే వాడివి॥ మేలుకో ॥

3. పిలిచే వారికి పలికెడి వాడవు
వేణువు నడిగితి నీ పలుకు తీపి
కనులు తెరచి చూడు కమల దళేక్షణా
వినయమున సేవించి వివశుడ నయ్యేద ॥ మేలుకో ॥





## 16. జో జో . . . . . నందనందనా

**పల్లవి :**

జో జో . . . నందనందనా !
జో జో . . . సుందర వదనా! . . . జో. . . జో. . .

**అనుపల్లవి :**

చిలిపి చేతల చందురుడా
ముసి ముసి నవ్వుల వాడా! . . . జో . . . జో . . .

**చరణములు :**

1. అలసితి వేమో ఇల పాలించి
సొలసితి వేమో భక్తుల గాచి
ఆశ్రితుల బరువులు మోసి
అవనికి భారము దించి
బడలిక చెందితి వేమో! ॥ జో ॥

2. అందరి చూపులు నీ మీదే
వారందరి పనులు నీ ముందే
రేయనక పగలనక
అందరి పనులు చేసి
శ్రమ పడిపోతివా స్వామి ॥ జో ॥

3. చూడలేను నీ అలత
అదియే నిరతము నా కలత
చీకటి పడిన కాలమైనా
కనుల నిదుర కరువేనా?
ఇంతేనా బ్రతుకంతా! ॥ జో ॥

4. ఎక్కడెక్కడ తిరిగితివో
పాదము లెంతగ నొచ్చినవో
చల్లని పదముల మెల్లగ నొత్తుచు
నేనూ వాలెద స్వామి
నిదురింతుము ఇక స్వామి ॥ జో ॥



## 17. సుందర చైతన్యాశ్రమం

**పల్లవి :**

సుందర చైతన్యాశ్రమం
భక్త జనుల కాశ్రయం
బాధ తీర్చి బోధ పంచే
నిత్య సాధనాలయం ॥ సుందర ॥

**చరణములు :**

(1) మాటకు పాటకు కోట లాంటి ఆశ్రమం
ప్రేమ పువ్వులు నాట్యమాడే తోట లాంటి ఆశ్రమం ॥ సుందర ॥

(2) ఉన్నవారు లేనివారు ఒక్కటైన ఆశ్రమం
కానివారు తెలిసిరాని కమనీయ ఆశ్రమం ॥ సుందర ॥

(3) వేదనాద రవళిని వినిపించు ఆశ్రమం
వేదమాత రూపమై కనిపించు ఆశ్రమం ॥ సుందర ॥

(4) శ్యామ చరణాలకు సుందర మందిరం
శాంతి కిరణాలకు చైతన్య ఆశ్రమం ॥ సుందర ॥







## 18. ఆర్ష సంస్కృతి

**పల్లవి :**

ఆర్ష సంస్కృతి గ్రామ వైభవ ప్రాప్తి కొరకే ఉద్యమం
త్యాగధనుల తపఃఫలము గడప గడపకు అంకితం ॥ ఆర్ష ॥

**చరణములు :**

1. స్వార్థ మెరుగని పరమ పురుషులు - సత్య మెరిగిన దివ్యఋషులు
వ్యక్తి సుగతికి లోక ప్రగతికి - పంచి పెట్టిన జ్ఞానమణులు
చేరుతున్నవి వారసులకు - చేయి చాచి అందుకోండి ॥ ఆర్ష ॥

2. క్షామ మెరుగని గ్రామసీమలు - కడుపు నింపే కన్నతల్లులు
కాంతి లేక శాంతి కరువై - నిలిచి యున్నవి నీడ లేక
కన్నతల్లి ఋణము దీర్చే - ప్రతిన బూని కదలిరండి ॥ ఆర్ష ॥

3. మనసు లోన మహర్షి వ్యాసుని - గుండెలో గురు శంకరుని
చూపులో విద్యారణ్యుని - నడకలో వివేకయతిని
నిలుపుకొని ఏగెదము ముందుకు - ఎదను చూపి తోడు రండి ॥ ఆర్ష ॥

4. గృహము గృహము ప్రమిద వెలుగు - ఇంటి ముంగిట తులసిమాత
గృహము లోపల నిత్యపూజ - ప్రేమ పలుకు శాంతి పిలుపు
గ్రామ మందున రామ భజన - ఆర్ష గ్రామ చైతన్య రచన ॥ ఆర్ష ॥





# చైతన్య గానం - 14



## 19. నీవు బాటసారివి - నేను మాటకారిని

*పల్లవి :*

నీవు బాటసారివి - నేను మాటకారిని
మాట లల్లి పాటలిస్తా - పాడుతూ సాగిపో ॥ నీవు ॥

*చరణములు :*

1. బాటలో ఆటలు ఎదురౌతాయి
ఆశలు రేపి ఎదను ఊపుతాయి
దిగినంతనే అవి బీట లౌతాయి
అడుగు అడుగుకు మడుగు లౌతాయి ॥ నీవు ॥

2.మతులు చెడుపుటే మాయగాళ్ళ జోరు
రహదారిలో వారి దారులే వేరు
దారి కాచి ఉంటారు - దగా చేస్తారు
ఎందరో నలిగారు ఎందరో బలయ్యారు ॥ నీవు ॥

3. మాటలు నమ్మి మోసపడి పోకు
ఏముందో మాటల వెనుక
మనసు పెట్టి చూడు
చూసి ఓర్వలేరు - చెడితే చేరదీరు
దారి తప్పించి నవ్వుకుంటారు ॥ నీవు ॥

4.మళ్ళీ మళ్ళీ రాదు - మానవ జన్మము
గమ్యము చేరుటే ముందున్న ధర్మము
పోరు ఎక్కడుందో పసిగట్టి దాటిపో
పెద్దల బాటలో సాగి తరించిపో ॥ నీవు ॥



## 20. అంబర మెక్కిన చల్లని చంద్రయ్యా

*పల్లవి :*

అంబర మెక్కిన చల్లని చంద్రయ్యా!
రేయంతా తిరిగావు చిక్కాడా నల్లనయ్య! ॥ అంబర ॥

*అనుపల్లవి :*

వెతికి నంత మాత్రాన వెన్నుడు చేజిక్కునా?
పూచిన ప్రతి పువ్వు పూజకు నోచునా? ॥ అంబర ॥

*చరణములు :*

1.పెరిగింది గాని బుద్ధి పెరగని తరువు
తన ఎదుగుదలకు కారణ మెరుగక
కొమ్మల నూపుతూ గాలిస్తుంది
బీజము తన లోనే ఉందని తెలియక ॥ అంబర ॥

2. వింత మనుషులు విచిత్రమైన ఊహలు
పిడికెడు మనసులో పుట్టెడు ఆశలు
చీకటిని వీడరు - వెలుగును చూడరు
ఏదైనా కోరుతారు - ఏదీ చేయరు ॥ అంబర ॥

3.నెల వెక్కడో తనది తనకే తెలియని
దిక్కు లేని దేవుని పట్టే దెలాగో?
శ్రుతి మతికి తెలుసు సత్య సామ్రాజ్యం
యతి హృదికి తెలుసు నిత్య స్వరూపం ॥ అంబర ॥

4. పాల లోనే వెన్న - పువ్వు లోనే తేనె
కట్టె లోనే నిప్పు - నిప్పు లోనే కాంతి
తిలల లోనే తైలం - జీవి లోనే దైవం
వెదకి చూడ నేల-వింత గొలప నేల? ॥అంబర ॥



## 21. శిలలే మేడకు పునాదులు

*పల్లవి :*

శిలలే మేడకు పునాదులు
మెరిసే రంగులే పై పూతలు ॥ శిలలే ॥

*అనుపల్లవి :*

మెరిసి మాసే పూతల కన్నా
నిలిచి మోసే పునాదులే మిన్న ॥ శిలలే ॥

*చరణములు :*

1. ఎంత వెలిగినా సొంత భవనము
అద్దె ఇంటి లోనే లోభి కాపురము
దైవము శోభించు అంతరంగమున
చిత్తము శోషించు ధన మోహమున ॥ శిలలే ॥

2. వైభవమైన బుద్ధి నిచ్చినా
శుద్ధి పడని మనిషిని చూచి
ఇచ్చిన వాడు మది నొచ్చుకొంటూ
మోము చూప లేక దాచుకున్నాడు ॥ శిలలే ॥

3. కష్టాల పోటులో బ్రతుకు సాగదు
సుఖాల మాటున మత్తు తొలగదు
కష్టసుఖాలలో సమముగా మెలిగే
బ్రతుకే ధన్యము అపురూపము ॥ శిలలే ॥

4. జ్ఞానముతో కొనసాగే బ్రతుకును
ఆపే రాత్రివి కాబోకు
కలలను కరిగించి కాంతులు విరజిమ్ము
హృదయమై, ఉదయమై ఊరేగు ॥ శిలలే ॥





## 22. తొలి పొద్దు పొడిచింది

*పల్లవి :*

తొలి పొద్దు పొడిచింది
మన తల రాత మారింది ॥ తొలి ॥

*అనుపల్లవి :*

హృదయము ఆలయ మైనది
ఆనందము దైవ మైనది ॥ తొలి ॥

*చరణములు :*

1. మనసు మురళియై పాడింది ఒక గీతం
శ్రీకృష్ణుని రాకకు అది ఒక సంకేతం
గ్రహణము వీడింది బ్రతుకులో
వెలుగులు ఉబికాయి గుండెలో ॥ తొలి ॥

2. నిరతము నడిచాను పాపగా నీ వెంట
ప్రేమమూర్తివి నిలిచావు
పాపగా నా కంట
సిరులెన్నో విలసిల్లు భువి లోన
సరి రాదు భక్తికి ఏదైనా ॥ తొలి ॥

3.కనికరించాడు కనిపించని వాడు
కల చెదరింది మనసుకు
కనువిప్పు కలిగింది
ఏనాడు కల గనని భాగ్యము
నేడది నిజమైన సౌభాగ్యము ॥ తొలి ॥



## 23. ధర్మ మార్గమున జీవించుటకు

*పల్లవి :*

ధర్మ మార్గమున జీవించుటకు ధనమే అవసరమా?
అధర్మ మార్గాన నడిచే బ్రతుకు అది ఒక బ్రతుకేనా? ॥ ధర్మ ॥

*అనుపల్లవి :*

ఎంత వెలిగినా వెలుగులను నీడలు వీడునా!
ఎలా బ్రతికినా మానవుని మృత్యువు మరచునా! ॥ ధర్మ ॥

*చరణములు :*

1. పైరగాలిని పలకరించుటకు పైసా అవసరమా!
మెరిసే చుక్కలను చూచుటకు మూటలు అవసరమా!
ఎంతున్నా తృప్తి రాదని బ్రతుకు చెబుతున్నా
తృప్తి లోనే సర్వ మున్నదని తెలియ దెందుకన్నా! ॥ ధర్మ ॥

2. మాయ లెందుకు మూన్నాళ్ళ కొలువుకు మోసా లెందుకు?
అనంత కాల గమనంలో నీ పయన మే దెసకు?
గూడు మిగలదు తోడు నిలవరు ఎంత బాదుకున్నా
బాధలు కదిపే లోకములో భోగ మెందుకన్నా ॥ ధర్మ ॥

3. సిరులు ఎందుకు సమత ఉండగా సంపద లెందుకు?
కాలం చకచక పోతున్నా మేల్కొన వెందుకు?
అనుబంధ మేల? అచ్యుతు డుండగా ఆవేశము లేల?
విచారము చేయ ఉన్నది నీవే - నీవే దేవుడుగా ॥ ధర్మ ॥







## 24. కనిపించని దైవం

*పల్లవి :*

కనిపించని దైవం కనికరించిన దేమో
లేకున్న ఈ దాహం ఎటు నీకు కలుగు? ॥ కనిపించని ॥

*అనుపల్లవి :*

ఏనాటి పుణ్యమో - ఏ వేల్పు వరమో
చేరింది సుకృతము - చేజార్చుకోకు ॥ కనిపించని ॥

*చరణములు :*

1. అంతా తెలుసన్న అజ్ఞానము కన్న
ఏమీ తెలియదనే జ్ఞానమే మిన్న
దొరికింది దిగ మ్రింగే మత్తేభము కన్నా
మకరందము పీల్చే మధుపమే మిన్న ॥ కనిపించని ॥

2. విన్నది బాగుంది వింత వింతగా ఉంది
విన్నది చేసుకోవాలి తనది
శిలలు కరుగును అలల రాపిడికి
మనసులు పెరగాలి వినిన రాబడికి ॥ కనిపించని ॥

3. నేలకు తెలుసు - నింగికి తెలుసు
గోవుకు తెలుసు - గోపాలుని మనసు
మనసున్న మనిషివి తెలియదా నీకు?
తెలియకున్న నేమి - తెలుసుకుంటే చాలు ॥ కనిపించని ॥

4. పెంచుకుంటే బలిమి
పంచుకుంటే కలిమి
ఏకమైతే చెలిమి ఏదేమైనా
గురువుల మాటలు శిష్యుల చేష్టలు
కలసి నడిచితే కైవల్యాలు ॥ కనిపించని ॥



## 25. రోజు పుట్టుక తూరుపు అయినా

*పల్లవి :*

రోజు పుట్టుక తూరుపు అయినా
ఏ రోజు కారోజు మార్పుగా ॥ రోజు ॥

*అనుపల్లవి :*

మార్పే ఉదయపు సోయగము
మారే మనసే సౌజన్యము ॥ రోజు ॥

*చరణములు :*

1.తూరుపు వెలిగెను - తామర విరిసెను
తుమ్మెద తూలుతూ ఝుమ్మని పాడెను
అడుగులు నేలపై నడచినా
నిలవాలి కనుచూపు గగనాన ॥ రోజు ॥

2.పోయిన క్షణము - తిరిగి రాదు
లేచిన కెరటము - పడక పోదు
మారని మనసు - చీకటి గృహము
మరణ వేదనకు నిలయము ॥ రోజు ॥

3. మనసుకు తెలుసు వెల ఎంతో!
హృదయానికే తెలుసు విలువెంతో!
విలువలు లేని జీవితము
వెలుగులు ఆరిన ఆలయము ॥ రోజు ॥

4. లోకమును మార్చే ప్రయత్నము
ఉన్మాదికి చేసే ప్రబోధము
తాను మారితే ఎంతో సుఖము
అదియే లోక కళ్యాణము ॥ రోజు ॥





## 26. మరపు రాదు నీ దయ

*పల్లవి :*

మరపు రాదు నీ దయ - ఓ దయామయా!
కలయైనా, నిజమైనా - కలవర మైనా ॥ మరపు ॥

*చరణములు :*

1. వేదము నీవే - నాదము నీవే
వేదాతీత జ్ఞానము నీవే
పుణ్యము పండగా నీ దరి చేరితి
కరుణించగా నీవు ధన్యుడ నైతి ॥ మరపు ॥

2. నా అన్నవారు - నా కెవ్వరూ లేరు
ఉన్నది నీవే - నా కున్నది నీవే
గుప్పెటి గుండెలో ఎలా ఒదిగినావో
కరుణను కురిపించి కడతేర్చినావు ॥ మరపు ॥

3. నారు పోశావు నీరు పెట్టావు
కంటికి రెప్పలా కాచుకున్నావు
తేజము తిమిరము అంతర మెరుగక
నీకై నిరతము పరితపించాను ॥ మరపు ॥

4. కలల మూటలన్నీ కారిపోయాయి
ఆశల దీపాలు ఆరిపోయాయి
కనికరించు స్వామి కదలిపోయే వేళ
కలసి పోతాను నీలో కలవరమే లేక ॥ మరపు ॥



# చైతన్య గానం - 15

## 27. చూచిన ప్రతి దానిని

*పల్లవి :*

చూచిన ప్రతి దానిని కోరే హృదయము
ఎక్కడ నేర్చిందో త్యాగము? ॥ చూచిన ॥

*అనుపల్లవి:*

అనుక్షణము - ప్రతిక్షణము
క్షణక్షణము - ప్రేమ వీక్షణము ॥ చూచిన ॥

*చరణములు :*

1. చూచి ఓర్చుకోలేని పరుల కనులలో
నిత్య వెలుగులు నింపమని
నిష్కారణంగా నిందించిన నోటిని
చక్కెరతో తీపి చేయమని
గుండె ఏమైనదో గుడి వెలిసింది
గుండె గుడిలో ప్రేమ కొలువు తీరింది ॥ చూచిన ॥

2. అస్తమించినా అర్కుడు ఆరని వెలుగు
నెలరాజు రాకున్నా పూచిన పున్నమి
మొక్కలేదు గాని విరిసింది పువ్వు
ఆరగించకున్నా తీరింది ఆకలి
ఏ పేరుతో నైనా పిలువు సంపెంగెను
విరజిమ్ముతుంది పరిమళాల సంపదను ॥ చూచిన ॥

3. దేవుడే ఉన్నాడని ద్వేషాల మాటున
ప్రేమై వెలిగాడని రాగాల చాటున
కన్నులు రెండైనా చూపు ఒక్కటే నని
ఉన్న ఒక్క సత్యమును అంతటా చూడమని
హరించి పోయింది హాలాహలము
పెల్లుబికి వచ్చింది ప్రేమామృతము ॥ చూచిన ॥





## 28. ప్రపంచ ముందని ఎవరన్నారు?

*పల్లవి :*

ప్రపంచ ముందని ఎవరన్నారు?
నిరూపించుటకు ఎవరున్నారు? ॥ ప్రపంచ ॥

*అనుపల్లవి:*

మనసులో మెరిసి చీకటిలో కలిసే
మాయా చిత్రము వింత జగతి ॥ ప్రపంచ ॥

*చరణములు :*

1. కల ఒకటుందని తెలియని దెవరికి?
కల నిజముగా తెలిసిం దెవరికి?
ఎలా ఉన్నా కల - ఉన్నది అల వలె
అల నిజమా? కల నిజమా? ॥ ప్రపంచ ॥

2. ముత్తెపు గిన్నెలో మెరిసే వెండి
సొమ్ములై సొగసుకు సింగారమౌనా?
ఎండమావిలో పారే జలము
దప్పిక తీర్చునా మేను తడుపునా? ॥ ప్రపంచ ॥

3. గంధర్వ నగరము - గగన కుసుమము
లేకనే ఉన్నవాయె - నేతి బీరకాయె
నీరు పల్ల మెరుగు - నిజము దేవు డెరుగు?
నిజము తెలిసే దాకా జీవుడై తిరుగు ॥ ప్రపంచ ॥

4. ఏది ఉన్నా దేశము లోనే
ఏది తెలిసినా కాలము లోనే
దేశ మనిత్యము - కాలము శూన్యము
నిత్యమై సత్యమై వెలిగేది బ్రహ్మము ॥ప్రపంచ॥



## 29. ఆరాట మెవరికి?

**పల్లవి:**

ఆరాట మెవరికి? పోరాట మెవరిది?
ఆటుపోటుల నడుమ ఉబలాట మేమిటి? ॥ ఆరాట ॥

**అనుపల్లవి:**

సహించలేక సుఖించలేక
భరించలేక బాగు తెలియక
బాధగా బ్రతుకు భారముగా ॥ ఆరాట ॥

**చరణములు :**

1. కెరటాని కెపుడూ ఆరాటమే
ఎరుగదు కడలి పోరాటము
ఆరాట పోరాటాలు జీవునివే
శాంతాకారము దేవునిదే ॥ ఆరాట ॥

2. స్వార్థమే జీవికి ఆసాంతము
స్వార్థ మెరుగదు పరమార్థము
అమవస చీకటి జీవత్వము
పున్నమి రాత్రి కైవల్యము ॥ ఆరాట ॥

3.కల్పిత పాము కాటేసే దేమిటి?
నేల విడిచి సాము సాధించే దేమిటి?
తేజము విరిసిన తిమిరము లేదు
కనబడితే త్రాడు పాము నిలవదు ॥ ఆరాట ॥

4.బుద్ధిలో నిలిచి కలుషాన్ని కడుగంగ
గురు కటాక్షమున వెలసిన జ్ఞానగంగ
వీడుకోలు చెబుతుంది జీవునికి
స్వాగతాలు పలుకుతుంది దేవునికి ॥ఆరాట॥





## 30. మాయలో దూరి

**పల్లవి:**

మాయలో దూరి - మమతలో చిక్కి
మోసపోతున్నావే చిలుకా! - సత్య మెరుగవే రామచిలుక ॥ మాయలో ॥

**అనుపల్లవి:**

గువ్వ లెటు పోయాయో - వెతుకుతూ పోయావు
తిరిగి వచ్చే సరికి గూడు చెదిరింది
గుండె చెరువుగ మారింది
నీ గుండె బరువుగ మారింది ॥ మాయలో ॥

**చరణములు :**

1.మేడలు మాడలు పుత్తడి రాశులు
నిత్యమని భ్రమ చెందకే చిలుకా!
సత్యమని భ్రమ చెందకే!
పాము కుబుసము వీడి - పారిపోయిన రీతి
కాయమును వీడి - ఎటు పోతవో చిలుక
నిజదారి తెలుసుకో చిలుకా! ॥ మాయలో ॥

2. వట్టిగా వచ్చావు - వట్టిగా పోతావు
తోడెవ్వరే నీకు చిలుకా!
గూడెక్కడే నీది చిలుకా!
విధి ఆడే ఆటలో - విడిపోవు బ్రతుకులో
మంచు వలె కరిగి - ఏమౌతవో చిలుకా!
నిజ మెరుగవె రామచిలుక! ॥ మాయలో ॥

3. గురుతు తెలిపే గురుని - బోధలో మనసుంచి
మర్మ మెరుగవె రామచిలుకా!
మాయను దాటవే చిలుకా!
సాధుసంతుల సేవ - సాధించు నిజత్రోవ!
శ్రద్ధను పెంచుకో చిలుకా!
తరియించి పోవే చిలుకా! ॥ మాయలో ॥



## 31. కడ తెలియని కడలిలో

*పల్లవి :*

కడ తెలియని కడలిలో అలలు ఏమిటో?
ఏకమైన బ్రహ్మములో ద్వైత మేమిటో? ॥ కడ ॥

*చరణములు :*

1. మానవ జన్మము - మాయా విలాసము
మనుగడ సర్వము - మానసోల్లాసము
ఉన్నది కాదు - లేనిది కాదు
ఉండీ లేని - వింత విశ్వము ॥ కడ ॥

2. రెక్కలు రెండైనా - రివ్వున ఎగిరినా
ఎగిరే గువ్వ - ఎప్పుడూ ఒక్కటే
దిక్కులు వేరైనా - దివారాత్రములు
అంబర మొక్కటే - ఆత్మ ఒక్కటే ॥ కడ ॥

3. లేని మనసులో స్వప్నము ఏమిటో?
లేని జగతిలో సంసార మేమిటో?
ఆరంభమే లేదు - ఎక్కడ అంతం?
ఆరోపానికి లేదు స్వరూపం ॥ కడ ॥

4. కలలో చేసిన - పాపాలు పుణ్యాలు
మేలుకోగానే - పంచునా ఫలితాలు?
కల శూన్యమైతే - ఫలితాలు సత్యమా?
అర్థమే లేదు - పరమార్థ ముండునా? ॥ కడ ॥





## 32. లేని వాణ్ణి నేను

*పల్లవి :*

లేని వాణ్ణి నేను - ఏదీ లేని వాణ్ణి నేను
నేననేది, నాదనేది, లేనివాణ్ణి నేను - ఏదీ లేనివాణ్ణి నేను ॥ లేని ॥

*చరణములు :*

1. ఎవరి వాణ్ణి కాను - ఎవరికీ చెందలేను
నేనే లేని వాణ్ణయితే - ఎవరికి చెందుదును?
నే నెవరికి చెందుతాను? ॥ లేని ॥

2. మంచి కాని వాణ్ణి - చెడు కాలేని వాణ్ణి
మంచి చెడులను దాటిన - మహిమ నైన వాణ్ణి
మహిమే నేనైన వాణ్ణి ॥ లేని ॥

3. ఏదున్న వాణ్ణి కాను - ఎవరున్న వాణ్ణి కాను
ఏదీ లేని ఎవరూ లేని - ఏక్ నిరంజన్ నేను
ఏక్ నిరంజన్ నేను ॥ లేని ॥

4. ఉన్నచోటే ఉన్నవాణ్ణి - లేనిచోట లేనివాణ్ణి
ఉన్నది లేనిది లేనిచోట - లేకనే నే నుండువాణ్ణి
లేకనే నే నుండువాణ్ణి ॥ లేని ॥



## 33. ఉన్నదే నీవు అడుగుచున్నది

**పల్లవి :**

ఉన్నదే నీవు అడుగుచున్నది
పొందాలనేది పొందే ఉన్నది ॥ ఉన్నదే ॥

**అనుపల్లవి :**

చెప్పలేనిదే నే చెబుతున్నది
ఎంతగా విన్నా విసుగు లేనిది ॥ ఉన్నదే ॥

**చరణములు :**

1.ఒప్పుకొనుటకు విశ్వాసము కాదు
కలలు కనుటకు ఊహలలో లేదు
అర్హత ఉంటే జ్ఞాన కుసుమము
విరబూయనుంది - పరిమళించనుంది ॥ ఉన్నదే ॥

2.ఉండి తెలియనిది - లేనిది కాదు
తెలుసుకుంటే - లేనిదే లేదు
ఎడబాటు లేనిది - తడబాటు తెలియనిది
గమ్యము తానైన - జ్ఞాన మార్గమే అది ॥ఉన్నదే ॥

3.వాడిన మాను చిగురిస్తుంది
తడిపిన చేను మొల కెత్తుతుంది
ఎండిన బావి నిండుతుంది
శ్రద్ధగా వింటే బ్రతుకు పండుతుంది ॥ ఉన్నదే ॥

4.చెప్పకనే శాస్త్రం చెబుతూ ఉంది
వినకనే నిన్ను వినమంటున్నది
చెప్పుటకు కాదు - వింటే రాదు
దైవకృప ఉంటే - తెలియకపోదు ॥ ఉన్నదే ॥





## 34. లేకనే ఎంతో చేసిన మాయ

**పల్లవి :**

లేకనే ఎంతో చేసిన మాయ
ఎటు పోయిందో - జాడలే లేవు ॥ లేకనే ॥

**అనుపల్లవి :**

ఏమై పోయిందో - ఎలా ఉందో
వెతుకుదామంటే - జ్ఞాపకాలే లేవు ॥ లేకనే ॥

**చరణములు :**

1.జన్మల యాత్రలు నడిపిన మాయ
మాయము కాగానే జన్మజాడ లేదు
మాయకు జన్మకు ఎంత ప్రేమ బంధమో!
ఏ ఒకటి లేకున్నా రెండవది ఉండదు ॥ లేకనే ॥

2. మాయ మత్తులో ఎగసిన ఆశలు
సరదాలు సందడులు వేసిన బంధాలు
చెలరేగి పోయిన అనుబంధాలు
చెడు చేయాలని చెడిపోయాయి ॥ లేకనే ॥

3.ప్రాణము లేని మాయ తీసింది ప్రాణం
నిర్జీవమై జగతికి పోసింది జీవం
ఎండమావిలో దప్పిక తీర్చుకోమన్నది
మనసును, మనుగడను మసి చేసింది ॥ లేకనే ॥

4.మేలుకోగానే కల కరిగింది
మేలు తెలియగానే మాయ చెదిరింది
ఆరింది మాయ - వెలిగింది మహిమ
ఏకమై, అఖండమై, అనంతమై స్వరూపమై॥లేకనే ॥



## 35. జయము వరించింది

*పల్లవి :*

జయము వరించింది - విజయము కలిగింది ॥ జయము ॥

*అనుపల్లవి :*

స్వారాజ్య సామ్రాజ్య, ముక్తి మకుటము, శిరమున నిలిచింది ॥జయము॥

*చరణములు :*

1. నేటి దాక దేహమనే గుడిసే నివాసము
వ్యాధులతో బాధలతో వ్యాకుల జీవనము
ఏమి విచిత్రము! పరమాశ్చర్యము!
నేడది సామ్రాజ్యము - ఆత్మానంద స్వారాజ్యము ॥ జయము ॥

2. పోగొట్టుకొనిన స్వరాజ్యము తిరిగి లభించింది
స్వరాజ్యానికి సామ్రాట్టునయ్యే భాగ్యము కలిగింది
సర్వము నేనే! సమస్తము నాదే!
అద్వయ భోగము! అనంత వైభవము! ॥ జయము ॥

3. నాది కానిది లేనే లేదు! ఏదైనా నాదే
నేను లేని ప్రదేశము లేదు! సర్వమూ నేనే
సర్వాధారము! సర్వాశ్రయము
నిత్యానంద మయం - అనంతానంద ఘనం ॥ జయము ॥

4. సిద్ధి ఎలా, ప్రసిద్ధి ఎలా, ప్రాప్త మైనదని
సందేహించకు తెలిపెదను - ప్రాప్తించే విధానము
ఈశ్వర కృపతో గురువు లభ్యము
జ్ఞానము ప్రాప్తము- గురుదేవుని ప్రసాదము॥జయము ॥



# చైతన్య గానం - 16

## 36. నాకు నీవు - నీకు నేను

*పల్లవి :*

నాకు నువ్వు - నీకు నేను
ఏనాటి బంధమో! ॥ నాకు ॥

*అనుపల్లవి :*

క్షణమైనా మరపురాని
మధురము అనుబంధము ॥ నాకు ॥

*చరణములు :*

1. చేప వీడదు నీటిని
వీడి బ్రతకలేదు
మనుగడైనా - మరణమైనా
నీటి లోనే సర్వము ॥ నాకు ॥

2. మబ్బు కదులును గగనములో
వీచును గాలి నింగిలో
మబ్బును గాలి కలవగానే
వాన కురియును క్షణములో ॥ నాకు ॥

3. మనసు యమునై పొంగినది
మాట మురళిగా పలికినది
హృదయమే బృందావనమై
ఆనందమే మకరంద మైనది ॥ నాకు ॥

4. కనిపిస్తున్నా లేనిది నేనే
కనుమరుగైనా ఉన్నది నీవే
తపము నీవే - జపము నీవే
నీవే ధ్యానము-మోక్షము నీవే ॥ నాకు ॥



## 37. వెదురు కూనకు రాగము నేర్పిన

**పల్లవి :**

వెదురు కూనకు రాగము నేర్పిన
స్వామీ నాపై దయలేదా? ॥ వెదురు ॥

**అనుపల్లవి :**

అన్నీ విడిచి, నిన్నే వలచి
తలచి, పిలిచి, అలసిపోతి ॥ వెదురు ॥

**చరణములు :**

1. తీగను నేను - తరువు నీవు
నిన్నే చుట్టి ఎదిగితిని
నదిని నేను - జలధి నీవు
నీ కొరకే పరుగిడితిని
వలపే వరదై ఉరుకుతున్నా
మనసు నెరుగవు ఎందుకని? ॥ వెదురు ॥

2. ప్రాణము పోసి పాఠము నేర్పి
బ్రతుకు బాట చూపితివి
నీవు చూపిన మార్గము లోనే
దారి తప్పక నడిచితిని
ఎక్కడ ఉందో నీ సదనము
వెతికి వెతికి వగచితిని ॥ వెదురు ॥

3. మల్లె లాంటి మనసు నాది
తేనె లాంటి తలపు నీది
వెన్న లాంటి పిలుపు నాది
మంచు లాంటి కరుణ నీది
ఎదను ఎందుకు తెలుసుకోవు?
ఎదురు చూడలేను నేను ॥ వెదురు ॥

4. కెరటము నేను - కడలి నీవు
కదలిక లన్నీ నీ లోనే
పడి లేచినా - లేచి పడినా
అల కులుకులు సంద్రము లోనే
ఎక్కడున్నా ఏది చేసినా
నా బ్రతుకంతా నీ లోనే ॥ వెదురు ॥





## 38. లోకమే నీ కోవెల

**పల్లవి :**

లోకమే నీ కోవెల
పూజారినై నేనిలా ॥ లోకమే ॥

**అనుపల్లవి :**

నామమే ప్రాణమై
గానమే ధ్యానమై ॥ లోకమే ॥

**చరణములు :**

1.నిను చూచి పొంగే నా కళ్ళలో
సుడులై తిరిగే ఆనంద సెలయేళ్ళలో
జలక మాడి జాడ తెలిపి
కరుణ జూపి కడతేర్చవా ॥ లోకమే ॥

2.చిననాడు ముడిపడిన అనుబంధము
చెదరదు ఎన్నడూ ఆ బంధము
అదియే అందము ఆనందము
ఆలాపనే ఆరాధనై ॥ లోకమే ॥

3.విడువలేను - మరువలేను
నిన్ను విడిచి బ్రతుకలేను
చేరాలి కడకు నీ పాదము
కరగాలి నీలో నా ప్రాణము ॥ లోకమే ॥

4. ఉన్న మనసు నీదై పోయె
మనుగడ సర్వము నీవే ఆయె
ప్రేమే చమురై వెలిగిన దీపం
ఆరకుండా కాపాడుకో ॥ లోకమే ॥



## 39. బ్రతుకు బొమ్మలాట

**పల్లవి :**

బ్రతుకు బొమ్మలాట - విను నా మాట
విధి నడిపే వింతలే - ఇలలో ఆట ॥ బ్రతుకు ॥

**అనుపల్లవి :**

ఇంతేనా - జీవిత మింతేనా?
చింతేనా - జీవికి చింతేనా? ॥ బ్రతుకు ॥

**చరణములు :**

1. దేవు డిచ్చింది మట్టి ఒక్కటేలే
కట్టు కున్నప్పుడే మేడ ఔతుందిలే
ఏదో ఓనాడు కూలిపోతుందిలే
చివరికి తన వారు వేసేది మట్టేలే ॥ బ్రతుకు ॥

2. ఆరే వెలుగులు స్థిర మనుకోకు
మారే మమతలు నిజ మనుకోకు
తరిగే దేహము మరిగే చిత్తము
కరిగే ప్రాణము ఎటు పోతాయో! ॥ బ్రతుకు ॥

3. నిర్మించుకోకు ఆశాసౌధము
అది కూలిపోతే మిగిలేది దుఃఖము
ఇసుక నెంత పిసికినా రాదు తైలము
కోరికలు తీరినా రాదెన్నడూ సుఖము ॥ బ్రతుకు ॥

4. రాలేవి ఆకులు కూలేవి మాకులు
అన్నీ గారడీలు మిగిలేవి గాయాలు
గమనాన్ని మార్చుకో-గమ్యాన్ని చేరుకో
నీలో నీవు నిండుగా ఉండిపో! ॥ బ్రతుకు ॥





## 40. నింగి ఉంది

**పల్లవి :**

నింగి ఉంది - నేల ఉంది
నడుమ ఏముంది?
పుట్టుక ఉంది - చావు ఉంది
అంతా నడుమే ఉంది ॥ నింగి ॥

**చరణములు :**

1.కలిమి ఉంది - లేమి ఉంది
కలకాల మేముంది?
సంపద ఉంది - ఆపద ఉంది
లోకం పోకడ ఉంది
ఏదున్నా - ఏది లేకున్నా
కాలం పోతూ ఉంది ॥ నింగి ॥

2.వింత ఉంది - చింత ఉంది
నిశ్చింత ఉంది
ప్రేమ ఉంది - ద్వేష ముంది
అంతా మనసై ఉంది
మనసును దాటిన మెలకువలో
ఎంతో వైభవముంది ॥ నింగి ॥

3. మంచి ఉంది - చెడు ఉంది
మంచే చెడుగా ఉంది
బంధం ఉంది - అందం ఉంది
భవబంధమూ ఉంది
బంధాలన్నీ తొలగిన నాడు
మోక్షమే ఉంది! ॥ నింగి ॥



## 41. పలుకుతూ పాడుతూ

**పల్లవి :**

పలుకుతూ - పాడుతూ
పలుకుతూ పాడుతూ ఉంటాను తోడుగా
నా ప్రాణ మున్నంత దాకా! ॥ పలుకుతూ ॥

**అనుపల్లవి :**

సంకటమైనా - సంతసమైనా
సంగ్రామమైనా - నీవే సందడిగా ॥ పలుకుతూ ॥

**చరణములు :**

1. గాలి సవ్వడిలో రాగా లేరుకొని
మేఘ ధ్వనితో లయ చేసుకొని
సెలయేటి గలగలలో మువ్వల రవళిని
తోడు చేసుకొని కీర్తించెద నిన్ను ॥ పలుకుతూ ॥

2. ఏది వచ్చినా - ఏది పోయినా
సర్వము తృటిలో జారి పోయినా
గుబులు చెందను-దిగులు పడను
నిండు మనసుతో ధ్యానించెద నిన్ను ॥పలుకుతూ॥

3. లేదు యోచన - తెలియదు యాచన
చేసే వారెవరు - నిను గను సూచన
తోచదు ఏదీ నీ స్మరణే గాని
లౌకిక మెరుగను లోకావనా! ॥ పలుకుతూ ॥

4. నీదైన నా మనసు ఏదో అయింది
నీకు దూరమైతే ఏమౌతుందది?
దూరము కాలేను-భారము కాబోను
నీ పదముల పడి- ఉంటాను పువ్వునై॥పలుకుతూ॥





## 42. ఏనాటి పున్నెమో?

**పల్లవి :**

ఏనాటి పున్నెమొ - ఈ జన్మ వరము
విరామ మెరుగని - రామనామ స్మరణము ॥ ఏనాటి ॥

**అనుపల్లవి :**

ఎంత కీర్తించినా - ఎంతగా స్మరించినా
తనివి తీర దెన్నడూ - ఎంత రుచి దాగి ఉందో ॥ ఏనాటి ॥

**చరణములు :**

1.ఏది చూచినా రాముని రూపము
ఏది పలికినా రామ నామము
ఎక్కడి కేగినా - ఏది చేసినా
వీడ దెన్నడూ రామ స్మరణము ॥ ఏనాటి ॥

2. రాముని పలుకే నా నోటిలో
రామధ్యానమే నా మనసులో
రాముని తలపే - రాముని వలపే
గుండె నిండా రామమే ॥ ఏనాటి ॥

3. జగమంతా రామ మహిమ
వర్ణించను నా తరమా?
విశ్వమంతా ప్రేమమయం
అదియే రాముని వైభవం ॥ ఏనాటి ॥

4. నిఖిల పావన నీ కీర్తిని
ఎంతని పొగిడెద - ఏమని పాడెద
వేదమాతయే వెనుకడుగు వేయ
ఊహింప గలమా నీ మహిమ ॥ ఏనాటి ॥



## 43. నా కంటి వెలుగువు

**పల్లవి :**

నా కంటి వెలుగువు
జగతికి వేల్పువు
సర్వమునకు నెలవు
సర్వులకు వెన్నెలవు ॥ నా కంటి ॥

**చరణములు :**

1. హృదయ వనములో జ్ఞానసుమాలు
వెదజల్లుతున్నవి దివ్య పరిమళాలు
చల్లగ బ్రోచే నల్లని స్వామి
ఊగుము ఊయెల నా గుండె లోన ॥ నా కంటి ॥

2. ఆర్తులను ఓదార్చే ఒడి నీదే
శ్రోతలకు బోధ పంచే బడి నీదే
మా లోని లోపాలు తొలగించి
దివ్యమైన దీపాలు వెలిగించు ॥ నా కంటి ॥

3. మరపురాని భావమే నీ రూపము
మరువలేని ప్రేమే నీ నిలయము
అదే ప్రేమాలయం - హృదయాలయం
నరుని దేవుని చేసే దేవాలయం ॥ నా కంటి ॥

4. ఎంత యోచించినా అంతు చిక్కని స్వామి!
ఎంత వారికైనా వింత గొలుపు స్వామి!
మందహాసము చిందు ఆనంద వదన!
మా పూజ లందుకో నందనందన! ॥ నా కంటి ॥





## 44. ఓ నావికా! ఓ సాధకా!

**పల్లవి :**

ఓ నావికా! ఓ సాధకా!
తప్పదు ఇరువురికి ప్రయాణము
తప్పించు కోవాలి ప్రమాదము ॥ ఓ నావికా ॥

**చరణములు :**

1. ఉప్పొంగే నీరే సంద్రములో
పొంగే కన్నీరే జీవితములో
నావ త్రుళ్ళినా జడవకు
బ్రతుకు క్రుంగినా వగచకు ॥ ఓ నావికా ॥

2. ఆగవు అలలు జలనిధిలో
అణగవు అలజడులు మనుగడలో
తొణకక సాగాలి ప్రయాణము
బెదరక నడవాలి జీవియానము ॥ ఓ నావికా ॥

3. సాగే నావ ఆగేందుకే
నడిచే బ్రతుకు నిలిచేందుకే
త్రోవలో ఎన్నో ఆటుపోటులు
బ్రతుకు దారిలో యెదబాధలు ॥ ఓ నావికా ॥

4. కోరినంత మాత్రాన సరిపోదు
గమ్యము చేరితేనే సిరి తోడు
నావ చేరి పోవాలి తీరము
బ్రతుకు సాగి పొందాలి మోక్షము ॥ ఓ నావికా ॥



# చైతన్య గానం - 17

## 45. మనిషిలో మనసు

**పల్లవి :**

మనిషిలో మనసు - మనసులో మోహం
తీరదు తాపం - ఏనాటి శాపం?
జీవి కేనాటి శాపం? ॥ మనిషిలో ॥

**చరణములు :**

1. ఎందరున్నా గాని కొందరే తన వారు
ఎంతవర కుంటారో వారైనా
రాకుండునా రేయి పోకుండునా జీవి
తిరిగి అరిగిన తనువు చితికి చేరేనా! ॥ మనిషిలో ॥

2. ఉన్న దొక దేహము పక్కెంత కావాలి
తల దాచు కొనుటకు ఇల్లెన్ని కట్టాలి
జానెడు పొట్టకు ఎందుకో ఈ ఆర్తి
తొలిగేది ఎప్పుడో జీవికి ఈ భ్రాంతి ॥ మనిషిలో ॥

3. రెండు చేతులతో ఎంత ఆర్జించినా
ఆరగించేది ఒక చేతితోనే
ఎంత ఉన్నా గాని ఎందరున్నా గాని
ఏగేది ఒక్కడే ఒంటరిగ ఏటికి ॥ మనిషిలో ॥

4. కార్య మేదైనా కర్మమే కారణము
దైవ మార్గములో ధర్మమే జీవనము
గురు సేవ ప్రాప్తించి జ్ఞానము లభించిన
మోక్షము సిద్ధించు జన్మ తరియించు ॥ మనిషిలో ॥





## 46. లేచింది అల - కరిగింది కల

**పల్లవి :**

లేచింది అల - కరిగింది కల
బ్రతుకంతా విరిసింది వెన్నెల ॥ లేచింది ॥

**చరణములు :**

1. వర్ష మొచ్చె పిలిచినట్టు హర్షముతో
విరజిమ్మెను మొగలిపూలు పరిమళాలు
ఎగిరెగిరి పడుతున్నది యమునా జలము
నందబాలుడు ఆనంద చిందులాడ ॥ లేచింది ॥

2. వేణువుతో గోపాలుడు వేడుక చేయ
మేత మరచె గోవులు మేను మరచె భామలు
మది లోన ఆ తలపు మెదలగానే
కనులు మూసి కలలలో తేలిపోతి॥లేచింది॥

3. అచ్యుతుడు అండజేరి అల్లరి చేయ
చెప్పలేని వింత వింత భావాలు
కవిని కానందుకు కలత చెందితి
తీపి జ్ఞాపకాలతో తన్మయమైతి ॥ లేచింది ॥

4. ఇలలోని కలతలకు దూరంగా
తేలిపోయి గగనంలో మేఘంలా
హరివిల్లులో ఇల్లు కట్టుకొని
కనులారా కన్నయ్యను చూసుకొని ॥లేచింది॥



## 47. మరువకు నన్ను - నిన్ను మరువనీకు

**పల్లవి :**

మరువకు నన్ను - నిన్ను మరువనీకు
నిను బాసి క్షణమైన మనలేను నేను ॥ మరువకు ॥

**చరణములు :**

1. వర్ణించి నిను పొంద - పోతనను గాను
ద్వేషించి దరి చేర - పూతన కాలేను
యాచనే గాని - యోచన లేనివాణ్ణి
కలిగించు దేవా! బంధ విమోచన ॥ మరువకు ॥

2. దూరమైనది నిద్దుర - ఏది నాకు వద్దురా
బుద్ధిగా నిన్నే - భజయింతు ముద్దుగా
పరవశించి పాడెద - నిత్యము నీ కీర్తి
నీవే నాకు దీప్తి - నీతోనే తృప్తి ॥ మరువకు ॥

3. మారు పలుకవేమి? నా లోన లోపమేమి?
మొర వినవు, మోము చూపవు, నే చేసిన పాపమేమి?
పెద్ద మనసు చేసి - ఉద్ధరించు మాధవా!
ఏలుకొనే స్వామి - పాపాలు ఎన్నుతావా ? ॥ మరువకు ॥

4. వీడలేను నిన్ను - విడువకు నన్ను
వినుము నా గోల - మురళిగాన లోల!
త్రిగుణాలను తొలగించు త్రిభువన పాల!
గాంచనీ సర్వము - వాసుదేవలీల ॥ మరువకు ॥





## 48. భక్తియే బలము - దైవమే భాగ్యము

**పల్లవి :**

భక్తియే బలము - దైవమే భాగ్యము
గురు సన్నిధిలో సిద్ధము మోక్షము ॥ భక్తియే ॥

**చరణములు :**

1. కరి మొర నాలకించి కదలి రాలేదా?
భక్తుని బాధ తెలిసి నరహరి కాలేదా?
శుద్ధ భక్తి ఉంటే - తోడునీడ తానే
పదము పట్టిన వారికి - పరమగతి తానే ॥ భక్తియే ॥

2. సంపదల సొంపు లేదు - ఆపదల ముంపు రాదు
కనుమరు గౌతాయి కవ్వించు విషయాలు
కంజదళాక్షుని క్రీగంటి చూపులో
తరలు తిమిరాలు - వెలుగు దీపాలు ॥ భక్తియే ॥

3. శమదమ పవనాలు వీచును చల్లగా
సుగుణ సరోజాలు వికసించు మెల్లగా
సంతులు తుమ్మెదలై భక్తి సుధను గ్రోలగా
జ్ఞానోదయ సమయాన సర్వము ఆనందమయము ॥ భక్తియే ॥

4. సురపురము కంటే, బ్రహ్మవరము కంటే
భక్తియే మిన్న, యోగశక్తుల కన్న
ధర్మ దారిలో ఆడుకొంటూ - భక్తితో వేడుకొంటూ
బ్రతుకంతా సాగితే భవ్యము జన్మము ॥ భక్తియే ॥



## 49. చెప్పవా? ఎందుకు పుట్టించావో?

**పల్లవి :**

చెప్పవా? ఎందుకు పుట్టించావో?
ఎందుకు పుట్టించావో? - ఏమివ్వా లనుకున్నావో? ॥ చెప్పవా? ॥

**చరణములు :**

1. ఆశలపై ఆశలెట్టి, నిరాశల గుట్ట పేర్చి
అందల మెక్కాలని, అణగారి పోయానని
గత జన్మలు నెమరు వేయక, క్రొత్తదారిలో పొమ్మని
పుట్టించావని నేననుకొనేది సత్యమా? ॥ చెప్పవా? ॥

2. వీనుల విందుగా - నీ కథలు వినమని
కనువిందుగా నిన్ను - అంతటా చూడమని
చింతలు తీరుటకు - నీ చెంతకు చేరాలని
ఇదే నీ భావమా? నిజమా? కాదా? ॥ చెప్పవా? ॥

3. చెలరేగుతున్నాయి కల్లోల పవనాలు
ముసురు కుంటున్నాయి కాలరూప తిమిరాలు
వర్షించు చున్నాయి కష్టాల వడగల్లు
నీ వైపే చూస్తున్నా, వస్తావని వరమిస్తావని ॥ చెప్పవా? ॥

4. పగలు మాసిపోనీ - రేయి మేలుకోనీ!
మృత్యువు రానీ - మేను రాలిపోనీ!
నీ పైనే నా ఆశ - నీ కొరకే నా శ్వాస
బాసటగా నిలిచి- బాస నిలుపుకోరా! ॥ చెప్పవా? ॥





## 50. దాటగలనో లేదో సంసారము

**పల్లవి :**

దాటగలనో లేదో సంసారము
చేరగలనో లేదో నీ పాదము ॥ దాటగల ॥

**అనుపల్లవి :**

కారు తిమిరాల కడలి సుడులలో
కనుమూసి తనువు తరలే లోగా ॥ దాటగల ॥

**చరణములు :**

1. మధుర మనిపించు మమతాను రాగాలు
మోసగించునులే వంచన చేసి
మంచిని త్రుంచి - మోహము పెంచి
మరుభూమి చేర్చే మాయా జగము ॥ దాటగల ॥

2. సాగిన కథలు మూగిన వ్యధలు
ఆగిన గాథలు రేపిన బాధలు
ఎచ్చటి కేగునో? మనసేమౌనో?
మట్టి కంకితము మలిన శరీరము ॥ దాటగల ॥

3. చిందర వందర బ్రతుకును వీడి
అంద చేరాలి నందనందనుని
చైతన్య సుందరుని సుమధుర గీతలు
గానము చేయుచు తరియించెదను ॥ దాటగల ॥

4. దాగాలి కలకాలం కనులలో నీ రూపము
బ్రతుకంతా నిలవాలి నాలుకపై నామము
గుట్టుగా ఒదగాలి గుండెలో జ్ఞానము
కడవరకు ఇలా సాగి కడతేరి పోవాలి ॥ దాటగల ॥



## 51. ఏదీ తెలియదు లోకంలో - ఎవరూ మిగలరు

**పల్లవి:**

ఏదీ తెలియదు లోకంలో - ఎవరూ మిగలరు
ఉండే దెవరో - పోయే దెపుడో ॥ ఏదీ ॥

**అనుపల్లవి:**

ఉన్నది, లేనిది, కానిది, అయినది
రంగుల జగతి - ఎవరికి తెలుసు? ॥ ఏదీ ॥

**చరణములు :**

1. ఎంత వెలిగినా ఏదో క్షణాన ఆరకపోదు దీపము
కాటికి చేరక తప్పదు ప్రభువైనా నిరుపేదైనా
కళకళ లాడిన బ్రతుకైనా చివరికి మిగులును కలగానే
ఉన్న దెందుకో? పోవుటేమిటో! జీవితమే ఒక బూటకం ॥ ఏదీ ॥

2. అయోధ్య పీఠము ఎక్కేనాడు అడవుల కేగుట ఏమిటో?
పరమశివునికి పాలకడలిలో విషపానీయము ఎందులకో?
ఆరాటాలు పోరాటాలు ఏమిటో ఉబలాటాలు
ఎవ్వరినీ విడిచిపెట్టని బాధలలోకం ఎక్కడిదో? ॥ ఏదీ ॥

3. సృష్టే మనిషికి అర్థం కాదు - సృష్టికర్త తెలిసే దెపుడు?
తానెవరో తెలియని వానికి - సృష్టి ఎలా తెలిసొస్తుంది?
కణకణములో నియతి ఉంది - అణువణువులో నియమం ఉంది
వ్యక్తి విశ్వము నియతి కాగా, సర్వరూపుడు నియన్త కాడా ॥ఏదీ॥

4. ఏ శిలలో శిల్పముందో, మలిచేవాడే ఎరుగడు
ఏ పండులో ఉందో తీపి, ఒలిచే వాడికే తెలియదు
ఏది ఉన్నా, ఎలా ఉన్నా, నిలిచే దేమిటో అర్థం కాదు
మిగిలేది వెలిగేది చివరికి ఆత్మే పరమాత్మే ॥ ఏదీ ॥





## 52. జన్మ తరించింది

**పల్లవి :**

జన్మ తరించింది
వాసుదేవ నామము - వాక్కున చేరింది ॥ జన్మ ॥

**చరణములు :**

1. తెలిసింది దారి ధర్మపథాన
చిగురించి వికసించి పండింది జీవితం
పువ్వులో తావిలా వెలిగింది బ్రతుకు
అంతా ఆనందం పరమానందం ॥ జన్మ ॥

2. నాదరాగ భావాలతో నవరస భరితంగా
నామము జపియించ నావ కదిలింది
తిరిగి చూచే సరికి తీర మొచ్చింది
పన్నగ శయనుని దర్శన మైనది ॥ జన్మ ॥

3. వాసుదేవుని వాకిట విరబూసిన పువ్వు
మాధవుని మందిరంలో వెలిగే అఖండం
కృష్ణయ్య పూదారిలో ఒదిగిన కుసుమం
అన్నీ నేనై పరవశించిపోతి ॥ జన్మ ॥





## 53. రఘుపతి నామము రసమయము

**పల్లవి :**

రఘుపతి నామము రసమయము
పలికే నాలుక పావనము ॥ రఘుపతి ॥

**అనుపల్లవి :**

మహిమను వలచి - మనసును గెలిచి
నామము పలకాలి - తనువు మరచి ॥ రఘుపతి ॥

**చరణములు :**

1. సదమల భావము - మధుమయ హృదయము
తత్త్వ విచారము - మహిమల నిలయము
తరతరాల తిమిరాలకు చరమ గీతము
అక్షర రూపము - అవనికి భాగ్యము
భక్తుల పాలిటి సౌభాగ్యము ॥ రఘుపతి ॥

2.మహిలో సంపదలు మనతో రావు
అనుబంధాలు అందాలు కావు
ఇలలో ఏవీ నిలకడ కావు
గోరంత దీపము - కొండంత తేజము
తారక నామము - ముక్తి మార్గము ॥ రఘుపతి ॥

3. నామము సత్యము - నామము ధర్మము
రామము ఒసగును - దివ్యధామము
ముక్తికి సాధనము రామ నామము
తరుగును దోషము - కరుగును పాపము
తొలగును బంధము - బ్రతుకు ధన్యము ॥ రఘుపతి ॥





## 54. బ్రహ్మైవాహం కిల!

( శ్రీ సదాశివ బ్రహ్మేంద్రస్వామి రచన )

**పల్లవి :**

బ్రహ్మైవాహం కిల!
సద్గురు కృపయా - బ్రహ్మైవాహం కిల! ॥ బ్రహ్మై ॥

**చరణములు :**

1. బ్రహ్మైవాహం కిల గురుకృపయా
చిన్మయ బోధానంద ఘనం తత్!
శ్రుత్యంతైక నిరూపిత మతులం
సత్య సుఖాంబుధి సమరస మనఘం ॥ బ్రహ్మై ॥

2. ఆశాపాశ వినాశన చతురం
కోశపంచకాతీత మనన్తం
కారణ మకారణ మేక మనేకం
కాలాకాల కలిదోష విహీనం ॥ బ్రహ్మై ॥

3.అప్రమేయ పదం అఖిలాధారం
నిష్ప్రపంచ నిజ నిష్క్రియరూపం
స్వప్రకాశ శివ మద్వయ మభయం
నిష్ప్రతర్క్యం అనపాయం అకాయం ॥ బ్రహ్మై ॥



## 57. సమయ మిదేరా! సరగున రారా!

**పల్లవి :**

సమయ మిదేరా - సరగున రారా!
సరసిజ వదన - చేసెద భజన ॥

**అనుపల్లవి :**

కరుణా రసపూర్ణ - పావన చరణ!
లీలామానుష - వేషాధరణ! ॥

**చరణములు :**

1. పూజకు విరిసిన పువ్వును నేను
నీ పదమును పట్టిన దాసుడ నేను
గుండె గుడిలో పూజారిని
నీ అడుగుల పడి ఉన్న విరజాజిని ॥

2. గీతము రాదు - సంగీతము లేదు
నా గీతలలో రాతలు నీవే
భక్తజన పోషా! మధుర సుభాషా!
మంజుల వేషా! హృదయ నివాసా! ॥

3. కల పండి నిను కడదాక
కననీరా నా కనులారా!
నీవే నా లోకం - నీవే సర్వం
నీవే నీవే జీవన గమ్యం ॥

4. నిన్నే సర్వంగా కొలిచిన ప్రాణం
నిలిచేలా లేదు ఎంతో కాలం?
కనికరించు దేవా! పదకమల సేవ
కదిలెద మనసార - నిను కొలిచి ॥





## 58. గలగల - కిలకిల

**పల్లవి :**

గలగల - కిలకిల
పారే నీరు గలగల
విరిసే నవ్వు కిలకిల ॥ గలగల ॥

**చరణములు :**

1. పారే నీటి పాయలో పారే కొలది నీరు మిగలదు
నవ్వే చిట్టి పాపలో పెరిగే కొద్ది నవ్వు నిలవదు
పారే జలము ఆరుటకా? పెరిగే జీవి వగచుటకా? ॥ గలగల ॥

2. పారే నదికి వంపులెన్నో? వంపులలో సొంపులెన్నో?
నవ్వే నోటికి వంకర లెన్నో? వంకరుల మాటున శంకలు ఎన్నో?
వంపులు సొంపులు శంకలు-తరచి చూడగా ఎండమావులు ॥గలగల ॥

3. గగన మెంత విశాలమైనా, చేదుకొనేందుకు ఏముంది?
జీవి ఎంతగా బ్రతికినా, తోడు నడిచే దేముంది?
అంతా మాయే జీవితము - వెలిగే మహిమే శాశ్వతము ॥ గలగల ॥

4. మనసును వీడవు మంచిచెడులు - మనిషికి తప్పవు కష్టసుఖాలు
వెలుగుల వెంటే నీడలు - నీడలాగితే వెలుగులు
ద్వంద్వాలన్నీ బంధాలే - అందమంతా గోవిందుడే ॥ గలగల ॥



## 59. ఎన్ని విభూతులు?

**పల్లవి :**

ఎన్ని విభూతులు? ఎన్నెన్ని మహిమలు?
భక్తులను బ్రోచుటకు భగవంతుని లీలలు! ॥ ఎన్ని ॥

**అనుపల్లవి :**

సాధుజన రక్షకుని - సంసార తారకుని
అజవందితుని - అద్భుత మహిమలు ॥ ఎన్ని ॥

**చరణములు :**

1. అనాదరము చేయడని - పిడికె డటుకులతో
బాల సఖుని - దర్శింపగ వచ్చిన
బొమికల బాపనుని - అంతరంగము నెరిగి
బొక్కసము నింపిన - భక్తజన వరదుడు ॥ ఎన్ని ॥

2. అసుర వంశమైనా - జనకుడు దుష్టుడైనా
హరి ప్రబోధములు - ఔదల దాల్చిన
ఎంత హింసించినా - దైన్యము నొందని
దైత్య ప్రహ్లాదుని - కరుణించిన నరకేసరి ॥ ఎన్ని ॥

3. నిండు కొలువులో - వలువలు తొలగింప
విలవిల లాడుతూ - ద్రుపద తనయ
కరములు జోడించి - 'అన్నా' అని పిలువ
వందల వలువ లిచ్చి - రక్షించిన శ్రీపతి ॥ ఎన్ని ॥

4. కల్మష మెరుగక - కొలిచే చైతన్యుని
ఎంత హింసించిరో - కలి మానవులు!
కల్లల నోర్చుచు - తల్లడిల్లిన
ఎదను పదిలముగ - నిలిపిన దేవుడు ॥ ఎన్ని ॥



## 60. ఊరు పేరు లేనివాడు

**పల్లవి :**

ఊరు పేరు లేనివాడు - లేనట్టే ఉన్నవాడు
ఆనవాలు లేనివాడు - అంతా తానైనవాడు ॥ ఊరు ॥

**చరణములు :**

1.అందరి మనసులను కదిలించే వాడు
కదిలే మనసులకు కంటబడని వాడు
ఎవరికి కానివాడు అందరివాడు
అంతట అందముగ అలరారువాడు ॥ ఊరు ॥

2.అందరిలోన కలసిన వాడు
అన్నిటి లోన కరిగిన వాడు
మరుగైనా తాను - మరపు రానివాడు
ప్రతి మలుపును వలపుగా మలిచేవాడు ॥ ఊరు ॥

3.మనిషి తానై, మనసూ తానై
మనిషికి మనసుకు అందని వాడు
మొగ్గలో పువ్వులా - పువ్వులో పిందెలా
పిందెలో పండులా - పండులో తీపిలా ॥ ఊరు ॥

4. పున్నమి చంద్రికలా చల్లనైన వాడు
నిండు వసంతంలా పండిన వాడు
బంధములన్నీ తొలగించు వాడు
వాడే మన వాడు - శ్రీ వాసుదేవుడు ॥ ఊరు ॥

## 61. బ్రతుకేమిటి? చావెవరికి?

**పల్లవి :**

బ్రతు కేమిటి? చావెవరికి?
తెలియదు - తెలిసిరాదు ॥ బ్రతుకు ॥

**అనుపల్లవి :**

పుట్టుట ఏడుపు - పెరుగుట ఏడుపు
తరుగుట ఏడుపు - తరలుట ఏడుపు ॥ బ్రతుకు ॥

**చరణములు :**

1. చచ్చే దేహం నిలవదు, ఎవరినీ చావు వదలదు - ఎన్నడైనా
కలసిరావు దేహాలు, కలసి పోవు కాయాలు - ఎప్పుడైనా
దరి ఎక్కడో - దెస ఏమిటో ॥ బ్రతుకు ॥

2. శ్వాసకు శ్వాసకు నడుమ, ఆశ ఒక్కటే ఉంది - బ్రతకాలని
ఆశ అల్లాడితే, ఆయు వాపుతుందా - ప్రాణాన్ని
మారి తీరదు - తీరు మారదు ॥ బ్రతుకు ॥

3. పోవుటకే వచ్చిన దేహం, పోక నిలవదు - ఎవరి దైనా
రాకపోకలు తెలియని ఆత్మ, ఎరుగదు గమనాగమనాలు
రాక ఎమిటో? పోక ఎచటికో? ॥ బ్రతుకు ॥

4. ఆత్మ అనంతము - నీవే అది, నేనూ అదే
నిజ మెరిగిన నాడు, లోక మేమిటి? శోక మేమిటి?
పూర్ణత్వమే అంతా ఆనందమే ॥ బ్రతుకు ॥



## 62. మట్టి బొమ్మ కాదు - మహిలో మనిషి

**పల్లవి :**

మట్టిబొమ్మ కాదు - మహిలో మనిషి
కీలుబొమ్మ కాకూడదు - విధిని చూసి జడిసి ॥ మట్టిబొమ్మ ॥

**అనుపల్లవి :**

విశ్వమును గాలించి - వ్యక్తిని శోధించి
సృష్టి కీలకము నెరిగిన మనిషి ॥ మట్టిబొమ్మ ॥

**చరణములు :**

1. పుత్తడి బొమ్మకు ప్రాణము లేదు
పుత్తడి కైనా ఇత్తడి కైనా మనిషే ప్రాణం
విలువను మరచి - నెలవును బాసి
రాజు లాంటి మనిషి - గాజుబొమ్మయ్యాడు ॥ మట్టిబొమ్మ ॥

2. జన్మకు చెల్లుచీటి రాసే శక్తి
జన్మహక్కుగా - మనిషికే ఉంది
కనని వినని వాటిని - కనిపెట్టిన వాడు
కనలేని దానిని, తన లోనే కనగలడు ॥ మట్టిబొమ్మ ॥

3. భక్తిని వలచి - యుక్తిని తెలిసి
ముక్తి పొందే శక్తి - మనిషికే ఉంది
తరాలెన్ని గడిచినా - తనువు లెన్ని మారినా
చిక్కు లెరుగని జీవుడు - చక్కనైన వాడు ॥ మట్టిబొమ్మ ॥

4. మట్టిలో కలిసేందుకు తోలుబొమ్మ కాదు
నిప్పులో కాలేందుకు గడ్డిబొమ్మ కాదు
బొమ్మలు కావు - జగతిలో జీవులు
బ్రహ్మరూపమైన - ఆత్మస్వరూపులు ॥మట్టిబొమ్మ ॥

## 63. కురియును వాన కాలువలో

*పల్లవి :*

కురియును వాన కాలువలో
కాలువ పారును నది లోకి
సాగును నది సంద్రానికి
సాగర మెటో తెలిసిం దెవరికి ॥ కురియును ॥

*చరణములు :*

1. గీతము లోనే భావము
భావము తోనే గీతము
గొంతుక మూగబోయిన నాడు
గీత మేమిటో? భావ మెవరిదో? ॥ కురియును ॥

2. నిన్న ఉన్నది నేటికి
ఉన్నది నేడు రేపటికి
రాదు నిన్న - లేదు రేపు
ఉన్నది నేడే అందరికీ ॥ కురియును ॥

3. రాత్రికి మెరుపు అందము
ఆ అంద మెంత కాలము?
తిమిరమైనా తేజమైనా
ఏదీ కాదు అంబరానిది ॥ కురియును ॥

4. పుట్టును జీవుడు పుడమిలో
పెరుగును జీవుడు లోకములో
పెరిగి తరిగి ఒరిగిన జీవుడు
తరుపరి ఎటకో? ఎవరికి ఎరుక? ॥ కురియును ॥







మనసు లోనిది మాట
గొంతులో అది పాట
రాగాలు, సరాగాలు కలబోసిన మూట
మదిలో మాధవుని దాచేందుకు కట్టని కోట.
భావాల కోట
రాగాల బాట
పాటల పూదోట
విహరించే మనసుకి పరచిన పువ్వుల బాట.
పున్నమి ఆట.
ఆడుకో, పాడుకో.
సారరూపుడైన సామగానలోలుని
సరిగమల వెనుక సరిగ, సమంగా దర్శించుకో.

సర్వే భద్రాణి పశ్యన్తు!

